# అభినవసరస్వతి

సంపు 5 { జానపాడు ప్రమాదీచ సంII ఆషాఢమాసము. } సంచి 7

## కృతివిమర్శనము.

మత్తయిసువార్త — ఇది రాజా మంత్రిప్రెగడ భుజంగరావు గారు రచించినది. వారి గ్రంథాములు బహుజనపరిచితములే కావున కవితాసారస్యము నరలవ్రాయుచ్చుటనవము. ఇందుఁ జేయఁబడినది యేసుక్రీస్తు మహిమాభివర్ణనము. ఈయేసు నూతనమతమును స్థాపించిన మహానుభావుఁడై యుండుటచేఁ దాపు అందువలననే తన్మత ముక్రైస్తవమని పలువు ప్రవేశించుచుండిరి. ఐనను బ్రాహ్మణాదివర్ణసంజాతులైన సనాతనధర్మానుయాయులచే నిది గర్హాపాత్రమై మ్లేచ్ఛహూణచండాలాదులచేతనే సమాశ్రయింపఁబడుచున్నయది. గ్రంథకర్త విలిఖించిన గ్రాంథికభాషలోని యేతన్మతగ్రంథములు దోషభూయిష్ఠములుగూడనై యుండుటచే భాషాతత్త్వమెఱింగినవారు పఠనచేయుటకైనను బద్ధాదరులగుట బాగుగాఁ గన్పట్టదు. లోకుల కాఱతిదిచ్చుటకయి యే పీఁకీసుబుద్ధి యేర్పడి యీగ్రంథమును వ్రాయఁగలిగిరి. కాని భాషాశుద్ధి కలిగియున్నంతనే పాఠకులు పరమతప్రవిష్టులగుటకుఁ బ్రయత్నింపరని నా యభిప్రాయము. శ్రీవారంపిన యీగ్రంథమామూలాగ్రముగఁ జదివినఁగాని యభిప్రాయమీయ వలనుపడక యట్లు చేయవలసివచ్చి కార్యబాహుళ్యముచే నొక్కనాఁటితో నప్పని ముగియక కొన్ని దినములు పట్టుటయుఁ దన్మధ్య నీగ్రంథము చదివెడిపట్టున "నేమిటిది?" యని యడిగెడివారికి గ్రంథనామముం జెప్పుటకు సిగ్గాధించుచువచ్చెను. కొందఱి కదివిడిచి చెప్పసాహసింపఁ దుద కిందు దిగఁగా మొదలుంటిరా?" యను నాక్షేపణకు మాత్రము పాత్రుఁడఁ గాక తప్పదయ్యెను. ఐననేమి గ్రంథమెల్లఁ జదువుసరికి, ఆహ్లాదమధురవాగ్రచనయు, ఆయేసుక్రీస్తు మహామహిమయు మనమ్మనంబాకర్షించియే తీఱినవి "లోకో భిన్నరుచిః" అనురీతిని కొందఱకుఁ గొన్ని మతములయం దభిరుచియుండుఁ గాక. అంతమాత్రమున నన్యమతమునకపకృష్టతయాపాదింపంబడు. కాని మెట్టినదైనను దాతతండ్రులనాఁటియాచారమును విడువఁగూడదని పెద్దలు చెప్పెడిమాట సత్యమనియే నానమ్మకము. హిందూవిద్వాంసులు లోకరేని క్రైస్తవమతబోధకులుగాక శ్రుతిస్మృతిపురాణేతిహాసప్రబంధనాటకాదుల యాంధ్రీకరణమందే తమ బుద్ధినివినియోగించుచుండ లోకోపకారార్థమై యీసత్యవేదమును దెనిఁగింపఁబూనిన

శ్రీ రాజాగారికి, ఏసుక్రీస్తు క్షేమానుసంధాయకుఁడై మృతులైనపుత్రీపుత్రులకు మోక్షప్రదాతయగుటయేకాక మరలఁ బుత్రీపుత్రవంతులం జేసి సంగతించుగాక

పాణిగృహీతాశ్రవణానందశృంఖల.—ఈపుస్తకము బ్రహ్మశ్రీ శ్రీపాదసుబ్రహ్మణ్యశాస్త్రిగారిచే వ్రాయఁబడినది దీనిపై విద్వత్కవులగుటయే కాక లౌకికప్రజ్ఞాధురంధరులు కూడనయి పక్షపాతరహితులుగ నిర్భయులై సువిమర్శనలు చేయుచుండెడి సుదర్శనీ పత్రికాధిపతులిచ్చిన సత్యమైనయభిప్రాయమే చాలును గాని మాకుఁగూడ విమర్శనార్థమై పంపఁబడినందునఁ గొండొక వ్రాయఁబూనితిమి గతమాసపత్రికలో నీగ్రంథకర్తగారి వేఱొకకవిత్వముపై మాయభిప్రాయమును వ్రాసియుంటిమి ఇప్పుడు యనచేతనే లిఖింపఁబడిన విమర్శనపై వ్యతిరేకాభిప్రాయమును లిఖించుమమ్ముఁ దజ్ఞులన్యథా తలఁప గని నమ్మెదము, ఎట్లో కవి యగుట కొంత సులభము గాని విమర్శకుఁడగుట మిగులఁగష్టము. ఒకశ్లోకము గాని యొకపద్యము గాని నిర్దుష్టముగ నే-రచించువారనేకులు గలరు కాని వానియందలి మంచిచెడ్డలను విమర్శించి వ్రాయువారు కడు నరుదు గానుందురు. ఇట్లగుట ప్రాచీనకాలమునందే కలదనుచో నిప్పుడు వేఱుగ వ్రాయనక్కఱలేదు. దీని నీటులుంచి మేము వీరివిమర్శనము విస్పష్టముగా వారువచ్చి వ్రాయఁబురికొల్పినయంశముల నించుక చూపుచున్నారము

106 వ పుటనుండి

(1) " ఉ॥ హెచ్చెడియుత్సుకత్వమున కెద్దియు బోరము గాక॥ 4ఆ 60ప పాణి॥"
హెచ్చెడిగి యుత్సుకత్వమా? ఉత్సుకమా?

77 వ పుటనుండి

(2) క॥ ఈవిధమున నతఁడెంతయు నావేదనఁ గొందుచుండె నవ్వలితయుఁ దా
నేఁ దిగఁ గోఁపక గృహమున కై వగ మీఱంగఁ జేరి యాత్మగతమునన్॥"
3, ఆ, 8వ ప, శ్రవ,,

బాలామణి యేమియుఁ దోఁచక గృహమునొంటుకుఁ జేరినదఁట? గృహములోనికేగక్కడఁ జేరినదో? గృహమును జేరెనదని గ్రంథకర్తలయభిప్రాయము, ద్వితీయకుఁ జతుర్థి ప్రయోగించినారు పంచమీవిభక్తి ప్రత్యయమును బ్రయోగింపనందులకు మన మానందింపవలసి యున్నది,,

1-2 సంఖ్యలు గుర్తుగాఁ గలగ్రంథపంక్తులవలన నీశాస్త్రిగారికి ధర్మధర్మి విభేదము పూజ్యమనియుఁ బ్రతిజ్ఞానమంతకన్నను బూజ్యమనియు బ్రాజ్ఞులు నిర్ణయింతురు

ఇట్లే ఈయన సుమారు 120 పుటలు నింపి పరిశ్రమ చేసి యున్నారు అందు ప్రతివిషయమును నపభ్రంశమున కుదాహరణముగ నే కన్పట్టుచున్న దని వ్రాయుటకు మిగులఁ జింతిల్లుచున్నారము ఆయాయంశముల నెత్తి చూపఁ బూనితి మేని సుమారొక వత్సరము మాపత్రికను దీనితోడనే కాలక్షేపము కావలసి వచ్చును గాన నందులకుఁ బూన నైతిమి మఱికొన్ని యపభ్రంశములనేని యీపుట కొంత యవసరమైనను ఈక్రింది పంక్తులవలన నందులకుఁ గూడఁ బూన లేదు.

' తృణీకరణము.

ఇయ్యది జూలై నెలాఖరులోఁ గాఁ బ్రకటింపఁ బడును ఇందు జ్ఞాన లవదుర్విదగ్ధులు మాశ్రీవణానంద పాణిగృహీతలయందుఁ జూపెడి వెఱ్ఱిమొఱ్ఱి కుశంకలు సహేతుకముగాఁ దృణీకరింపఁ బడుచుండును. వెల ముంగుగాని చెప్పఁ జాలము. జూలై నెలలోఁగా నార్డరుపంపువారికి సగము వెల మాత్రమే

ఇట్లు
కింకవీంద్ర ఘటాపంచాననులు,
తిరుపతి వేంకటేశ్వరులు,
బందరు, లేక కాకినాడ.

పైపంక్తులు శృంఖలా గ్రంథపీఠికనుండి గైకొనఁ బడినవి' ఈనోటీసును గ్రంథకర్తను శ్రీతిరుపతి వేంకటేశ్వరులు పూర్వమే, అనగా? శృంఖలా గ్రంథమునకుఁ బ్రకటనార్థమై కవితాపత్రికను సప్లిమెంటుగా నంపించిన నోటీసులు చూచినంతనే పంపినట్లు సుబ్రహ్మణ్యశాస్త్రిగారే ప్రకటించి యున్నారు దీనింబట్టి వీరిశృంఖల తిరుపతి వేంకటకవులను గడ్డిపోఁచగా మాత్రందగినది యని యభిప్రాయము తేలుచున్నది ఈయన తిరుపతి వేంకటకవులకు శిష్యులైన వెంకట రామకృష్ణకవులకు శిష్యుఁడు. ఈయంశ మీయనయే వ్రాసికొనెను ఇయ్యాలఘుని గురువులు వ్రాసిన 'శతఘ్ని, సంగతియేమైనదో సపాశుపతాశ్వమేధమువలన విస్పష్టపడును. ఆయశ్వమేధపీఠికలో నుదాహరించిన (1) శ్రీయుత జయంతి రామయ్యపంతులవారు (2) శ్రీ చెన్నాప్రగ్గడ భానుమూర్తి పంతులవారు (3) శ్రీ గురుజాడ అప్పారావు పంతులవారు లోనగువారియభిప్రాయములవలన రామకృష్ణులవ్రాఁతయందలి నిస్సారత పూర్తిగా వెల్లడి యగుచున్నది. దానిపైఁ బగాస్త్రపాశుపత మను పేరుతో శతఘ్నికర్త లేవో కొన్ని వ్రాసి విరమించుటవలనఁ గూడ

లోకము యథార్థమును బూర్తిగా గ్రహించి యున్నది. గురువులసంగతి యటులుండఁగా నిఁక నీశిష్యుని సంగతి యేమగునో చదువరులు గ్రహింపక పోరుగదా? ఈశిష్యు నియోగ్యతకీశృంఖల కొండొకసూచక మని చెప్పెదిని. ఏమందురా? పైనుదాహరించిన మహామహులెల్ల శతఘ్నికి నపకర్ష యుఁ బాశుపతమున కుత్కర్ష యు బోధించుచున్నను నీ వెం॥ రా॥ ల శిష్యుఁడు శతఘ్ని నట్లు పొగడుచున్నాఁడు.

## 78 వ పుటనుండి

"రామకృష్ణప్రయుక్త మగుశతఘ్ని సగసతిరుపతి వేంకటకవులవైదుష్యమను దుర్గప్రాకారమును ఖండఖండములుగఁ జేయుట యెల్ల యెఱింగినవిషయమే"

పైపంక్తులవలన నియన యింకను పాశుపతమునుగాని యందుదాహరించినప్రాజ్ఞులలేఖలనుగాని చూచినట్లు తోఁచదు, చూచినూడ నిట్లువ్రాసినచో నిఁక వేఱుగఁ జెప్ప నక్కఱయే లేదు. ఏది యెటులున్నను నీయన మంచిగురుభక్తుఁడని తెల్పుటకు పైపంక్తులు సాక్ష్య మిచ్చుచున్నవి, మా యభిప్రాయముచెప్పిన నీయనవ్రాంత లోకమునకుఁ గొండొక యుపకారకము గావచ్చుననియే, ఏమందురా? ఇట్టివిదగ్ధులకుఁ గలుగునల్పశంకలను నివర్తించుటకుఁ దమంతఁ దా మేప్రాజ్ఞులును బూనరు, ఇప్పుడో, ఇది యొక బీజముగాఁ జేసికొని తిరుపతి వెంకటేశ్వరులు తమవైదుష్యమును పాశుపతమునందుంబలెఁ బ్రకటింతురు శ్రీనందిరాజుచలపతిరావుపంతులుగారు వ్రాసినప్రకారము దానిచే ననేకులు గతసంశయు లౌదిరు ఈయంశము పాశుపతమునఁ జూడఁదగు ఈశృంఖలలో నీచోక్తులు, తిట్లు తలఁగఁదగనిమాటలు విస్తరించి యున్నవి అవి చూపనిమమ్ము లోకము క్షమించుఁగాక

తాలుకుట్టనము — ఇది బ్రహ్మశ్రీ వేలూరి శివరామశాస్త్రి గారిచే రచియింపఁబడిన పద్యమయంబగు నొక విమర్శనము. ఈవిమర్శనము రామకృష్ణకవుల యట్టహాసముపైనిదై యున్నది. కృతజ్ఞతా కృతఘ్నతలకేమిగాని మొత్తముమీఁద శిరుభయములను సత్రీఝలే వారు గురువులమీఁదికి శతఘ్నులు ప్రయోగించి యట్టహాసములు చేయంబూనితే వారికిఁ దాలుకుట్టనము చేయుట కీయనపూనెను గ్రంథము యుక్తియుక్తములగు తగు జవాబులతో నొప్పు ముద్దులు మూటగట్టుచున్నయది వలయువారు గ్రంథకర్తపేర వ్రాసికొనవచ్చును వెల 0-3-0 భు కృష్ణాజిల్లా, ఆగిరిపల్లె

శ్రీమత్పరదేవతాయనమః

# పిష్టపేషణమ్.

ఆర్యమిశ్రాః, విదితమేవ భవతాం శ్రీమతాం పశ్యాంపశ్యా, పశ్యశబ్దవిచారశ్చేతి గ్రంథద్వయతః "పశ్యాపశ్యా" వితి సమస్యాప్రేషకాణాం తదనుయాయినాంచ వాదదౌర్బల్యమ్, అథేదానీం 'పశ్యశబ్దమీమాంసేతి సమస్యాప్రేషకై ర్వ్యస్యైకస్యచి "చ్ఛశ్శోఫకే," ర్నామ్నా ప్రకటీకృతా కాచనపత్రికా, తస్యాంచ నకించి న్నవీనం, నైవ కించిదపూర్వంచ దృశ్యత ఇతి హేతోః పిష్టపేషణం, చర్వితచర్వణమితిచ విదుషాం విస్పష్టమేవ, తథాపి తద్గతవాదదౌర్బల్యం దిఙ్మాత్రం ప్రకటీక్రియతే జ్ఞానలవదుర్విదగ్ధానాం పండితమ్మన్యానా మస్మత్ప్రతిపక్షిసోదరాణాం ముదే.

భో భో స్సమస్యాప్రేషకాః, భోభో నామగోపనశీలాః, భో భో స్సర్వథా పరాభూతాః ప్రతిపక్షిసోదరాః! జానతేవా మహామహోపాధ్యాయబిరుదాంకితానాం బ్రహ్మశ్రీతాతాసుబ్బరాయశాస్త్రిణాం వ్యాకరణశాస్త్రపారంగతత్వం, విచారణావైదగ్ధ్యంచ, తత్తద్విహితై ర్విచారితే విచార్యమాణేచ, కాశికాకాలతః ప్రాచీనప్రమాణప్రమితలౌకికప్రయోగ సంపాదన వైధుర్యతః। ప్రతీక్ష్యమాణే చాఽస్మిన్ దురుద్ధరే విషయే కిమితి ప్రయత్యతే జ్ఞానలవదుర్విదగ్ధతామాత్రపర్యాప్తైర్భవద్భిరంతర్హితై రసురైరివ మాయాప్రకృతిభిః, తేహి సంప్రాప్తే పరాజయే స్వతస్సిద్ధాం మాయా మవలంబ్య యథాకథంచి ద్విజృంభంతే, తత స్తత్ఫల మనుభూయ తత్సదృశం దశా మాలంబంత ఇత్యపి తత్తద్యుద్ధ ప్రసక్తిప్రవచనపరాయణై ర్గ్రంథై శ్శ్రూయతే, వ్యాకరణశాస్త్రే భవతాం ప్రవేశదారిద్ర్యం భవదుద్ధరణాయప్రవృత్తం 'దర్బారు' నామకం పత్రమేవ కంఠతః ప్రవక్తి, తద్ధి భవద్గౌరవార్థం 'రామరాయ కవీంద్రాః కతిచన మాసాన్ వ్యాకరణ మపఠ న్నిత్యలిఖదితి సువ్యక్తమేవ భవతాం శ్రీమతాం మహారాజశ్రీమతాంచ, కతిపయమాసమాత్రపఠనత స్తావ ద్వ్యాకరణపాండిత్యం కించిల్లబ్ధమపి తదే

తన్మహామహోపాధ్యాయ పరిత్యక్త విషయే గతిం కల్పయితుం నాల మితీదానీమపి వా జ్ఞాయతాం శ్రీమద్భిః, చిరకాలసాధ్యే దురుద్ధరే ఽస్మిన్ వ్యాకరణే నహి భవతా మధికార ఇతి భవత్ప్రకటితా పశ్యశబ్ద మీమాంసైవ కథయ తీత్యలం బహునా, భవద్వ్యాకరణపాండిత్యం భవత్కవితాసామర్థ్యంచ భవచ్ఛాఖాసంబంధినా మాశ్చర్యదాయకమపి శతశ స్సహస్రశః పండితమండలీ విరాజమానానా మితర శాఖాసంబంధినాం నైవ తాదృశం, తథాపి కేవల కుక్షిపూరణమాత్రప్రయోజన విద్యాభిమానినాం మధ్యే కశ్చి దేతాదృశోఽపి విద్యత ఇతిహ్యతీవాఽనురాగోఽస్మాకం చాన్యేషాంచ భవతాముపరి, అతఏవ భవ "లీలాతరంగిణీ" గతకలుషతరప్రసంగప్రకటన మేతావత్పర్యన్తం నైవ ప్రకటీకుర్మ ఇతి విదాంకుర్వంతు మహారాజశ్రీకాః, కాశికా కాలతః ప్రాగ్విద్యమానం లక్ష్యం కించిదపి నైవోపలబ్ధం భవతామితి భవతాం 'మీమాంసైవ కథయతి, పశ్యంతు—

„వామనా త్ప్రాక్కాలేఽపి నిరుపసృష్టపదప్రయోగ సద్భావస్య వామనవ్యాఖ్యానాదేవాఽనుమీయమానత్వాత్॥ .... నచలౌకిక లక్ష్యాభావ శ్శంక్యః, అనుమాన సిద్ధత్వా ల్లౌకిక లక్ష్యాణామ్"॥

ప్రదర్శితా ఏతాః పంక్తయఏవ భవద్వాదస్య దౌర్బల్యమాపాదయంతీతి జానతే సంధిపంచకమాత్రపారీణా అపి విద్యార్థినః, ప్రత్యక్షతః ప్రమాణప్రమిత లక్ష్యసంభవేఽపి కిమితి యత్యతే దురవగాహేఽస్మిన్ విషయ ఇతి పృచ్ఛామో భవతః కిమస్త్యుత్తర మత్ర తత్కథయంతు, అనుమానతః ఖలు లక్ష్యసత్తా సాధ్యతే భవద్భిః తేనైవాఽస్మాభిర్లక్ష్యాభావశ్చ సాధ్యతే, కాశికాకార స్తావ న్నిరుపసృష్టపక్షం నిరాచకార, ప్రమాణప్రమిత లక్ష్యసద్భావే కథంకార మయం నిరాకుర్యా దిత్యనుమానతఏవ పూర్వోక్త ముపపద్యతే ఽస్మాకం, తత స్తస్మతం శుష్కవైయాకరణావలంబిత మిత్యపి సూపపాద మేవ, తదేతత్ప్రపంచిత మేవ పశ్యశబ్దవిచారే ఽస్మాభిః—

"శ్లో॥ భాష్యే కిమపి నాస్తీతి కృత్వా కేచి న్మహామహాః
ఆలంబ్య ఛాందసాధారం నానువృత్తిం వితేనిరే

"శ్లో॥ తదేత ల్లక్ష్యవి చ్ఛాస్త్రవిచ్చ శ్రీవామనో మహాన్, ని
రాచకార లక్ష్యాణాం లౌకికానా మభావతః" (పశ్యశబ్దవిచారః)

విస్తరస్తు తత్రైవ ద్రష్టవ్యః, అపిచ, భాష్యం స్వమత మనురుద్ధ్యతీత్యపి లిఖితం భవద్భిః, త దప్యేనమేవ భవతీతి స్పష్ట మేవతద్వ్యాదామ్, ఉపసర్గపదానువృత్తిం భాష్యకార స్తావ న్నైవవ్యాకరో దితి ఖలు భవతా మాశాబంధః, తదేత త్సర్వం బ్రహ్మశ్రీ జయంతి భగీరథశాస్త్రిభి స్సమ్యక్ప్రపంచితమపి తత్పంక్తి సమన్వయజ్ఞాన వైధుర్యత ఏవం ప్రవర్త్యతే భవద్భి రితి మన్యతే బాలిశోఽపి, నచే ద్భాష్యకారౌదాసీన్యం యథాభవతా మనుకూలతాం ద్యోతయతి తథైవాఽస్మాకమపీతి న కథం విజ్ఞాయతే, తథాహి, అనువృత్తి స్స్వతస్సిద్ధేతి ,స్వరితేనాధికారః, ఇతిసూత్రప్రత్యాఖ్యాతా శ్రీమహాభాష్యకృ త్ప్రత్యక్షతో బోధయతి, స్వతస్సిద్ధాయా అనువృత్తేః క్వచి న్నివృత్తి ర్యద్యపేక్ష్యేత తదా వ్యాఖ్యానం శరణ మిత్యపి భాష్యప్రవృత్త్యా జ్ఞాయతే, ఏతద్దిశా భాష్యకారౌదాసీన్యం సోపసర్గమతానుకూల మితి నవక్తవ్యమేవ తద్వ్యాదాం, ఆస్తా మిదం, యది భాష్యస్య కాశికామతం విరుద్ధ్యేత్ తర్హి భట్టోజీదీక్షితచరణా స్తావ దన్యథా కథం తన్మతఖండనాయ ప్రవర్తేర న్నిత్యపి దురుద్ధరో యుష్మాకం మహామహోపాధ్యాయానాం స్వరితత్వప్రసంగప్రసక్తౌ ప్రదర్శితవిప్రతిపత్తి రివేత్యలం బహునా, కించ పూర్వోక్త రీత్యా భాష్య మస్మాకమే వాఽనుకూలం, భవతాంతు న కించిదపి, పదవాక్యప్రమాణపారీణ మల్లినాథసూరిరపి నైవ భవతాం కించిద ప్యుపకరోతి, మల్లినాథసూరిస్తు "నైషధీయ" ధయా, నిత్యస్య, ఇతి గతి రితి ధర్మపిండ మదాత్, తదేత ద్భవన్మత ముద్ధరతీతి కక్షతాడనం విదధతాం భవతాం వివేకః కీదృశ ఇతి వర్ణ్యతే విజ్ఞై రితి లజ్జామహే వయం, ఏవం ప్రతిపదఖండనం విధాతుం ప్రవర్త్యతే యది గ్రంథో విస్తార్యతే, అతోభవదుక్తం సర్వమపి, నిరాలంబ మిత్యేకమేవ వాక్య ముచ్చై రుచ్చార్య యుజ్యతే తూష్ణీంభవనం, తథాఽపి లోకారాధనా మైతానదపివా విలిఖ్యతే, కిమితి నలజ్జతేవా భవతాం లేఖిని, "కాశికాకారమతస్య మహాజనాపరిగృహీతత్వాచ్చేతి లిఖంత్యా

స్తస్యాశ్చ లజ్జేతి నహి కోఽపి వక్తుమీష్టే ప్రాజ్ఞః, భట్టిప్రభృతయో మహాజనాన్నైవ భవంతీత్యపి శబ్ద్యతేవా అహాహా మహ దాశ్చర్యం, మహచ్చ సాహసం, తేషాం మహాజనానాం నామపారాయణం పశ్యాశబ్దవిచారే సమ్యక్కృత మపి పున శ్చాఽత్ర జ్ఞానలవదుర్విదగ్ధ స్సాకం వివదమానానా మస్మాకం పాపపరిహారాయేతి కృత్వా తత్ర న్నామపారాయణం క్రియతే

"మహాకవి ర్భట్టిః, రావణార్జునీయధాతూదాహరణకావ్యకర్తాచ వాసుదేవకావ్యనామకాష్టాధ్యాయ్యుదాహరణకర్తాచ, ధాతువృత్తికర్తా మాధవశ్చ, అన్యేఽపిచ నిరుపసృష్టమతం నాఽనుకుర్వంతి, కాశికా వ్యాఖ్యాతా పదమంజరీకర్తాపిఽ తత్రైవ, భట్ట్యాదయ శ్శాస్త్రస్య లక్ష్యత్వేన కావ్యం విరచయంతః కించిదపి నిరుపసృష్టమతం సమ్మతంచేదేకమపివా కథం నదద్యురు దాహరణం తాదృశం,, (పశ్యాశబ్దవిచారః)

విస్తరస్తు తత్రైవ ద్రష్టవ్యః, అపిచ శబ్దితం నిరుపసృష్టమతే సర్వేష్టసిద్ధిరితి, త దవిచారితరమణీయం, తదేతన్న్యాజీపీడాచార్యేణాఽపిప్రోక్తం "శాస్త్రప్రవృత్తిః కథం విద్యతే, తద్వేదః కథం ప్రవర్తంతే ప్రవర్తకానాంచ కశ్చగరీయాన్, కస్యవా మతం బహువిద్వత్కవిమాన్యం" ఇత్యాదికం విచార్యం, ప్రతిబంధకాభావే సర్వేష్టసిద్ధి రితితు నవక్తవ్యం, తథాచే ద్వ్యాకరణశాస్త్రాభావే పండితపామరసాధారణ్యేన సర్వేషాం చోక్తయః ప్రమాణపదవీం ప్రతిపద్యంత ఇత్యపి సువచం, అపిచోక్తం, పశ్యార్థై రితి నిర్దేశా దయం సురక్షితో భవతీతి

తదేతత్ భవద్దేశికేనాఽపి ప్రదర్శితం, ప్రత్యయవిధానం కర్తరి నిర్దేశస్తు భావ ఇత్యేత దప్యజానత స్తస్య వాద స్తావత్రైవ సమాప్తి మగమత్, భవత స్తావ దస్మదుక్తరీత్యా తావన్మాత్రం జానతః కోఽ ప్యవకాశ స్సమావతిత్తోఽపి సోపి కాశికామతే, నిరుపసృష్టాదపి భావేఽపి శప్రత్యయో నిపాతనా దితికల్పితుం శక్యత్వా న్నిరస్యతే, నిరుపసృష్టమతేహి, భావమాత్రఏవ నిపాతనం, సోపసృష్టేతు నిరుపసృష్టాదపీ త్యుచ్యతే, నైవాఽత్ర లాఘవగౌరవవిచారః, అన్యథా ప్రాప్తస్యాఽ న్యథోచ్చా

రణంహి నిపాతనం, తచ్చ యథాకథంచి దపి సర్వం నిర్వాహత్యేవ, నచ తత్రాసామర్థ్యస్య సాధారణ్యేన తస్యానిరాఘాటత్వభంగః ప్రసజ్జేతేతి దిక్, "బాధకాన్యేవహినిపాతనాని" స్వవిషయే యద్యత్ప్రతిబధ్నాతి తత్తత్సర్వం బాధయితుమేవ నిపాతనోక్తికథన మితి జానతే విశేషజ్ఞాః, నచే ద్దీక్షితా అప్యముమేవ సద్దేశ మాలంబ్య ప్రవర్తేరన్, తేతావత్ నిరుపస్కృష్టాదపీతి వక్తుం శక్యత ఇతి మనసి నిధాయైవ దుర్బల మముం పంథాన ముపేక్ష్య ప్రాయతంతాన్యేనైవ పథేతి సూక్ష్మమతీనాం సువ్యక్తమేవ, సూత్రకారోక్తనిపాతనైకశరణం ప్రయోగ మనువదతో భాష్యకారస్యవా త మనుకుర్వతః కైయటస్యవా ప్రవృత్తి ర్భవతా మకించిత్కరేతి విదాంకుర్వంతు, "పశ్వార్థ" నిర్దేశ మాలంబ్య భవద్గురవస్తావ ద్గర్తే న్యపతన్, భవాంస్తు నతథేత్యేతావాన్ భేదః, భవన్మతసంరక్షణంతు కాశికాతః ప్రాక్కాలికం లక్ష్యం యది విద్యేత ప్రమాణప్రమితం లౌకికం తదాతు సముజ్జీవతీతి పునఃపునరావేద్యతే భవతే నామగోపనచతురాయేతి సర్వం శివం,

చదువరులారా!

ఇంతవఱకుఁ జర్చించినవిషయము వ్యాకరణశాస్త్రజ్ఞులకుమాత్రమే గోచరింపఁ దగినది యగుటచే సంస్కృతభాషయందు లిఖింపఁబడినది. ఈక్రిందియంశ మీగ్రంథకర్తృత్వనిర్ణయమునకు సంబంధించినదగుటచేఁ దేటతెలుఁగుమాటలతో నుపక్రమింపఁ బడుచున్నది,

"పశ్వశబ్దమీమాంస"

అనునీచిన్నపుస్తకమును రచించినకవి మ॥ రా॥ రా॥ బెల్లంకొండరామారావుగారే యనియు నెవరో శశ్శోచ్ఛటిపేరునం బ్రచురించిరనియు నింతకు మున్ను వ్రాసి యున్నారము. ఇందులకుఁ దగినయాధారము నీవలసిన భారము మాపై నున్నది, దానిని జూపుచున్నారము

I

"... పశ్వశబ్ద మీమాంస బయలు వెడలినది, ధూ-పాళ నరసింహము మీయడ్రసుకు పంపుకునని చెప్పెను ఇదిగాక నర్సారావుపేటలో, మ-రా-రా-బొగ్గరపుశర్మగారు కూడ మీకు రామారావుగారే పంపిరట్లుచెప్పెను. ప్రకృత గ్రంథమునకు గర్తృత్వము శ్రీరా

మశర్మగారికే పెట్టబడియెను. ఆయన నైషధాంత సాహిత్యము కలవాఁడు. వక్తృత్వశక్తి యున్నది. ఒకరీతి సంస్కృతాంధ్రములయందు కవిత్వముకూడ జెప్పును. తెలివికలవాఁడే కాని వ్యాకరణములో గావ్యములలో వచ్చెడి సూత్రములకేమేని అర్థము తెలిసియున్ననుండునుగాని కౌముదియైనను జదివినట్లు కాన్పించదు..... చేతనో మతిమాలి మీమాంసాగ్రంథకర్త గావుట కొప్పికొని యుండును .... .

2

(చేవ్రాలు)

......సమన్వయవిషయమై రామారావుగారు జవాబు వ్రాసి మరివొకరిపేరుమీఁద ముద్రించినారట. యితరత్రా విన్నాను. ధూళిపాళ నరసింహంగారుకూడా చెప్పి యొకపుస్తకం పంపుటకు తమల్ దనుకూడా వ్రాసుకొన్నారు..... (చేవ్రాలు)

3

"తమపుత్తరం అందినది, బొగ్గరంవారు నియోగులు, వినుకొండతాలూకా చిరాపురం, అగ్రహారం. (చేవ్రాలు)

పై నుదాహరించిన మూఁడుత్తరములవలనను శ్రీ రామారావుగారు గ్రంథకర్తలనియు వారే యితరుల పేరిఁటో దీనిం బ్రకటించిరనియు విస్పష్టమేకదా? ఈయంశము గుంటూరు డిస్ట్రిక్టువారికి మేము తెలుపనేయక్కఱలేదు. దూరదేశవాస్తవ్యులకొఱకై యిందు లిఖించితిమి. రావుగారు చాటుచాటుననుండి యీ "దొంగబూచి దోబూచు"లను బ్రచురించుటకన్నఁ దమపేరునీఁదనే వ్రాయుట కొంత యుక్తమని తలఁచెదము. దూరగులు మోసపడినను సమీపస్థులు నిజ మెఱిఁగి తమ ప్రవృత్తిని గర్హింతురనియేని వారు తలఁపకుండుట శోచనీయము రావుగారు మమ్మును వృథాగ వెక్కిరించుచున్నట్లు గూడఁ దెలియవచ్చుచున్నది. ముందు దానింజూపి కొంశాక వ్రాసి విరమింతుము.

"......ఉపనయనములో రామారావుగారితో ధూళిపాళ నరసింహము వేమవరములో బ్రహ్మరథం పట్టునపుడు రామారావుగారిశిష్యుడు పిరాట్ల అప్పయ్యశాస్త్రి యొకకోపుపూనె నని యాక్షేపించెనట. అప్పుడు రామారావుగారు పావలా, అర్థా అడిగికొన్నారని మహాహాం

కారమున బలికెనట. ఏమా. ....గారికే యాంధ్యనస్థితి మహాగర్వ్వ విశిష్టముగా గనబడియెనట. మాట మాటలాడితే మీానిందావాక్యమే వచ్చెనట శ్రీరామశర్మ యీామీామాంసపై ఖండనము చేయుజోయి కాగితమును చేయవలెనేకాని వేఱురీతి చేతగాదనియెనట. . (చేవ్రాలు.

అయ్యా! రామారావుగారూ! పైనుదాహరించిన యుత్తరము లలోని యంశములు సత్యములేకదా? అగుచో మిమ్మొకటి యడుగుచున్నారము. మీారు వ్రాసిన మీామాంస దరుద్ధర మనునమ్మిక మీాకుఁ గలిగియున్నప్పుడు మీాపేరుమీాఁదుగానే దాని నేల ప్రచురింపకైతిరి. పాపాయ పరపీడాయ,యనునట్లు వృథాగా శర్మశాస్త్రిపేర నేల్ప్రకటించితిరి. మొట్టమొదటినుండియు గూఢవర్తనము నేయవలంబించుచుడి మేమ్మెఱుఁగలము, మీాకు వ్యాకరణములో నెంతటిశక్తియున్నదో యింతకు మున్నొకపరి మీారు దర్బారులో హితవాది,పేరునఁ జంకలు గొట్టికొనుచుఁ బ్రచురించినలఘువ్యాసములలనే యెఱిఁగితిమి, ఆ వ్యాసపుమాతృకలో మీాస్వహస్తలిఖితము కొంత కలదు, అది మాకు దృగ్గోచరమైనది, మీాకుఁ గౌముదిలో నుదాహరించిన పశ్యః అనునుదాహరణముదక్క దీనింగుఱిచి లవమును దెలియదనియు నిటీవల నాయీయిపండితులుమాతో వివదించుటలో వారివ్రాతలను మేము ఖండించుటకు మూలనున్నవానిని ముంగిళ్లకుఁ దెచ్చి బయల్పఱచుటచే మీా కిప్పటికి రెండుపంక్తులు వ్రాయుట కాలంబనములైనవనియు మామదికిఁ బూర్తిగా వచ్చినది, మీారుమీాకొన్ని నెలలవ్యాకరణపాండిత్యముతో నెంతకాల మిందువిక్రమించెదరో చూడఁ లంచియే యింటి మికాన సప్రమాణముగ లిఖింపుఁడు,పాపము? మీాకొఱకై మీాగురువుగారువచ్చి బెండుపడి యున్నారు, చేతనైనచో వారినుద్ధరింపుఁడు,మీాపై బోలెఁడాసతో నున్న శాఖాభిమానులముఖపంకజములను వికసింపఁ జేయుఁడు, పిప్పివ్రాతల్వ్రాసి మాకుఁ బని గల్పింపకుఁడు, ఇంతకాలము వఱకు మిన్నకున్నట్టులే యిప్పుడును మిన్నకుండుఁడు, దానివలన మీాకు నపయశము రాదు, కాశికావృత్తికిఁ బూర్వకాలమందలి ప్రమాణప్రమితమగులౌకిక ప్రయోగము దొరకు వఱకును మీారు దాసీనుల

రగుటకన్న మంచియుపాయము లేదు, ఇప్పటికి సుమారు సంవత్సర మున్నఱనుండి యీవాదము జరుగుచున్నది, ఇప్పటివఱకది చిక్క లేదు, ముందు చిక్కవచ్చును, త్వరయేల? అప్పుడు లేచి విజృంభింప వచ్చును, అంతవఱకు శాంతింపుఁడు, పాపము మీయంతమీ రిందు దిగువారు కారు, దింపినవారు వేఱు, వారిస్వహస్తలిఖితములు మావద్దఁ జక్కియున్నవి, ఆయుత్తరములలోనిపోకడలు మీరు దగ్గఱనుండి వ్రాయించినవియే, అందలివాక్యముల నెత్తితిమేని మీకు లక్ష్యము దొరకినను జయము దుర్లభము, కేసు బలము గలదియైనను ప్లీడ రసదయైనచో భ్రష్టమగు నట్లు లందలివ్రాఁత యంత దుర్బలముగానున్నది, పని వచ్చినప్పు డవియుఁ బ్రకటింతుము ఇంతవఱకు మీత్రాఁడు, బొంగరము లేనివ్రాఁతలకు వానివలనఁ బ్రత్యుత్తరమీవలసి లేదనియెఱుఁగుఁడు

ఉ॥ త్రాఁడును లేదు బొంగ్రమది దబ్బఱయాట యిఁకెట్టులాక్కొ? మీ
రోడినచందముఁ దెలుపు నోజలు పల్వురుగల్గి యుండియుఁ
బాడెదరేటికో యకట? పాడినపాటయె, మీదుపద్ధతిఁ
గూడనిపోకలున్నవనికూడ నెఱింగియు నేల బింకముల్॥ ౧ ॥

తే॥ గీ॥ జ్ఞానలవదుర్విదగ్ధులు గా లిఖించి
నారు సుమ్మను, మీ కున్న జ్ఞానమెంత,
ఎంత యని మి మ్మడుగ నేల "కృష్ణలీల,
లోని "మలమూత్ర" పుంగాథ తానె తెలుపు॥

ఇట్లు, మీమిత్రులు,
తిరుపతి వెంకటేశ్వరులు



1 వీరు జనసామాన్యమున కెంతవరకు తమ (మేధావి) నుపయోగించిరి.

2 తమ (మేధావిని) దేశాభివృద్ధికిని విద్యా విహీనులగు తమ సోదరులకును వినియోగించుటకును సమకట్టిరా?

పై వాక్యద్వయమునందలి ‹‹మేధావి" పదము వీ రేయర్థమున వాడిరో? అంతటి తెల్వితేటలుగల యీ ‹‹హితవాది" విద్యావిషయమునఁ గలుగఁజేసికొని "పొగరుఁబోతులు" లోనగు పదములతో నోరుచేసికొనఁగాఁ దాము పత్రికలో నెక్కించుట యెంత శోచనీయమో మాకృష్ణారావుగారికిఁ నేని బోధపడుఁగాక యని మాత్రము వ్రాసి యీగోష నాము నింతతో వదలుచున్నారము. వీరెల్లరు దేశభక్తులవ? పండితులుగాని కవులుగాని అట్టివారు కారవ? ఈ భయరహితులవ్రాఁత యెట్టిదైనను దానిని బత్రికలు ధరించునవ? వహ్వా? పత్రికలసాబగు "అహోహో స్వామిరూపమడుగనా?" కావుననే ప్రౌఢసరస్వతిగారు వీరినిగూర్చి తగినట్లు వ్రాసి మందలించియున్నారు. విస్తరభీతిచేనది యిచ్చోట నుదహరింప మైతిమి. ఇక్కడికే మిగులఁ బెరఁగినది. ఏమిచేయుదుము అవ్యక్త ప్రలాపములయందలి మంచి చెడ్డలను నెఱింగియు నెఱుఁగని జ్ఞానములతోఁ బత్రికల కెక్కించెడి ధీరమ్మన్యుల వలన మాకీవృథాశ్రమ కలుగుచున్నది. ఇఁకఁ బ్రత్తిపాటియతఁడు మేము సభలోఁ బాడినట్లుగా ‹‹కొప్పరపువారు" చెంచితపాట ననుసరించి కల్పించి వ్రాసియిచ్చినదానింగూర్చి కొండొక వ్రాయఁబడుచున్నది. ఆ తుమ్మెదపాటలోని వాక్యములు గాని వరుసగాని పోకడఁగాని మాదిగాదు, ఆసభకు రాని కొప్రపువారు కల్పించుటచే నది యిట్టులున్నది.

వచ్చినపో తరాజుగారుకూడ నదేశ్రోవను మనోరంజని లో లిఖింపఁజో చ్చిరి కాని ఆయననోటి కష్టమిటి? మేమవధానసమయమునఁ దుమ్మెదపాటను బాడనేలేదు. మాశిష్యుఁడవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రి మాయవధానమైనపిమ్మటఁ జెప్పిన యాంశుకవిత్వ ప్రసంగములోఁ బాడినది నిజము. కావున వైరులొనర్చు కుకల్పనలు నిరాధారములు, ఆపాట కొండొక యుదాహరించుచున్నారము.

(సభలో పాడిన తుమ్మెదపాటలోని చరణములు)

1 పం,చపాండవులు, తుమ్మెదా? 2 విరాటునగరి, తుమ్మెదా? 3 ఉందుండఁగాను తుమ్మెదా? 4 సై,రంధ్రిఁజూచి తుమ్మెదా? 5 మో,హించి నాఁడు తుమ్మెదా? 6 అం.తటిలో నాతుమ్మెదా? 7 భీ,ముకిఁజెప్పె తుమ్మెదా? 8 మం,డిపడ్డాడే తుమ్మెదా?

మేము నాఁడు సభలోనఁ బాడినపాట శైలి యిది కాని యిటీవలఁ దజ్ఞులవలన నిజమైనశైలిని గ్రహించి మాయీవివాదము నెల్ల భారతాదులంబలెనీపాటలోనే రచించి యుంచితిమి కొలఁదిదినములలో. ప్రకటింపఁగలము కొన్ని చరణము లిం దుదాహరించెదము.

నిజమైనశైలి గలతుమ్మెదపాట.
("కొండవీటిదండయాత్ర" నుండి)

1 పరదేవతకూ తుమ్మెదా? వందనము చేసి తుమ్మెదా? వందనమూచెసి తుమ్మెదా? 2 మాడరక్ శైలిని తుమ్మెదా? మా,ట్లాడుతానేతుమ్మెదా?మాట్లాడుతానేతుమ్మెదా 3 క్లాసికిల్ కేమే తుమ్మెదా? క,ట్టాలున్నా యేతుమ్మెదా? 4 స్కూ,ళ్లలోపలదీన్ని తుమ్మెదా?చూ,చుచున్నారే

తుమ్మెదా? చూ, చుచున్నారే తుమ్మెదా? 5 తుమ్మెద, తుమ్మెద ,తుమ్మెదా? తు మ్మెద వినవే తుమ్మెదా?"

శైలీప్రదర్శనార్థమై యించుక చూపితిమి గేహళీదత్తదీపన్యాయమున నియ్యది స్కూళ్ళలో నవీనశైలిని వ్యాసములు వ్రాయుబాలురకుఁగూడ నుపయోగింప వలయు ననుకుతూహలముతో రచించుచున్నారము. ఇఁక నీప్రత్తిపాటి కామేశ్వరకవిగారివ్యాసపువిషయమును వదలి వేమవరాగ్రహారావధానమునుగూర్చి ప్రాజ్ఞులు వ్రాసినలేఖలు మఱికొన్ని యుదాహరించుచున్నారము.

(1) తమరు వేమవరాగ్రహారమునఁ జేసినశతావధానసమయములో మాయింటివద్ద నుండులంకమృత్యుంజయశాస్త్రి యనువిద్యార్థి యచ్చటనే యున్నవాఁడు, సభావర్ణనము కోరినాఁడు అక్కడ జరిగినవైభవ మింతింతని చెప్ప శక్యము కాదని చూచి తీర వలె నని మాకు మొన్నటిరోజున నిక్కడఁ జెప్పినాఁడు మిక్కిలి సంతోషించితిమి రామారావుగారిసమస్యలు వారికిఁగూడ నర్థము కాకుండ ననుకూలముగఁ జెప్పినవా రని చెప్పినాఁడు త్వమేవాహ మనునట్లు తమరు పరదేవతాస్వరూపు లని యనేకు లానందించుచున్నారు....

ఆ సీతారామశాస్త్రి,

గుంటూరు, హాస్టలు.

**14-3-13.**

2 "...చిట్టాప్రగడ సీతారామాంజనేయు లనేకనమస్కారములు......తమరు వేమవరములో దిగ్విజయప్రద మగునవధాన మొనరించినప్పుడు దురదృష్టవశాత్తు వ్యాధిగ్రస్తుఁడనై యుండి అచటికి రాజాల

నైతిని తదుపరి మాహాస్టలులో కొందరు విద్యార్థులు తదవధానమ
హాత్మ్యవావలోకనక్రమ మంతయు జరగినసమాచారములును మా
కు దెల్పుచు గుంటూరిసీమం గూర్చి వారివారికి వలనైనంతగా మాకు
వర్ణించి చెప్పిరి......

చి. సీ. ఆంజనేయులు.

ఇట్టివి పెక్కులు గలవు గాని విస్తరభీతిచే నుపేక్షించి ప్రత్య
క్షముగాఁ జూచినయొకనియోగిశిఖామణియుత్తరము నీక్రింద నుదా
హరించుచున్నారము

24-4-13.

గుంటూరు.

"...నర్సారావుపేటతాలూకా యేల్చూరుగ్రామకాపురస్తుడును
ప్రస్తుతము గుంటూరులో ... భువనగిరి వెంకటశివావధానిగారివద్ద
గుమాస్తాయున్నా అయ్యిన యేల్చూరు వెంకటసుబ్బయ్య నమస్కార
ములు—అయ్యా, తాము 28-12-1912 తేదీని వేమవరం అగ్రహారం
లో భాగిచెన్నయ్యవర్గైరాలచే జరపబడిన అవధానమునకు నేను వ
చ్చినవాడను సదరు అవధానమునుగురించి జరిగినయథార్థమును నాకు
ను అక్కడికి దయచేసినసభ్యులకున్నూ నిజానిజములు తెలిసేయున్నవి
అక్కడ జరిగిన యథార్థమును వదలి ఆంధ్రపత్రికలోనూ, కృష్ణాపత్రి
కలోనూ, మనోరంజనీపత్రికలోనూ ప్రచురించినవ్యాసములను జూచితిని
ఆవ్యాసములలోనివ్రాతలు కేవలము అబద్ధము శాఖాభిమానముచేత
వ్రాయబడినవ్రాతలు గాని సత్యమయ్యినవ్రాతలు కావు, ది 28-12-12
తేదీని నాజనకగ్రామమయ్యినమార్టూరులో బయలుదేరి సదరు వేమవ

రం అగ్రహారమ్నుకు 1 గంటకు చేరితిని నేను వచ్చేసర్కి మాస్వగ్రా
మ మైన యేల్చూరునుంచిన్ని కొప్పరముగ్రామమునుంచిన్ని నాకు మి
త్రులున్ను, బంధువులున్ను అయ్ని 1 పోతరాజు కృష్ణయ్యగారు
న్ను, 2 యీలక్ష్మీనరశింహ్వాకవి అష్టావధానిగారున్ను, కొప్పరము
నుంచి సదరు లక్ష్మీనరశింహముకు మేనల్లుడయ్ని కొప్పరపు వెంకట
రత్నమున్ను యీ వెంకటరత్నముకు బావమరిదిఅయ్ని ప్రత్తిపాటి
కామయ్యగారున్ను సోదరకవులవద్ద విద్యనభ్యసించెడిభద్రాజున్ను
గుంటూరు కాపురస్తుడయ్ని ధూళిపాళ నరశింహ్వముగారున్ను యిం
కా మఱికొందరు కొప్పరమునుంచి వచ్చి యున్నారు నేనును వారును
సదరు తేదీని సభారంభముకు ముందు వేమవరంలో పగలు 2 గంటల
కు కలుసుకొని మాట్లాడుతూ సభాముఖమ్మున కరుదెంచితిమి అక్క
డ కూరుచున్నతోడనే నామిత్రుడయ్ని మ॥రా॥రా॥ పోతరాజు లక్ష్మీ
నరశింహముగారు "నీవు యెవరిపక్షమున నుండెద వనిన్ని యిక్కడ
కొంతచర్య జరపవలసియున్నదనిన్ని నన్ను అడగగా నేను నియోగి
శాఖవాడ నయ్యును విద్యాపక్షపాతమునే అవలంబించి న్యాయమా
ర్గమును చూచువాడను గాని అన్యాయముకు పాల్పడువాడను కానని
స్పష్టముగా వారితో చెప్పితిని, తదుపరి వారు చేయుప్రయత్నములు
నాతో చెప్పుట మానిరి. నాయెదుటనే వారిలో వారుయేదో ప్రసం
గించుకొనుచుండిరి. కృష్ణాపత్రికలో మల్లాది సోమయాజులగారి పేరిటికి
వకజాబున్ను, వంగిపురం కృష్ణమాచార్యులుగారి పేరిట్కి వకజాబు
న్ను తెచ్చి ఆనాటిసభలో చదువుటకు ప్రయత్నం చేయగా అగ్రాస
నాధిపతిగారు చదువనివ్వక ఆపినట్టున్ను వ్రాయడము కేవలము అబ
ద్ధము, సదరు వుత్తరములు ఆరోజున తెచ్చినమాటయున్ను అబద్ధము

శ్రీభూశీపాళ నరశింహ్వాముగారు తనస్వదస్తూరీతో వకవుత్తరమును చదివి సభలో అగ్రాసనాధిపతిగారికి యిచ్చి యున్నాడు. అవధానంలో తుమ్మెదపాటపాడినారనేమాట కేవలము కల్పితము యీరెండురోజులు మేమందరము కలసి వకచోటనే వుండితిమి. సదరుత్తరములు సోదర కవులు వ్రాసినారనేమాట నమ్మతగదు. ప్రత్తిపాటికామేశ్వరరావు గారు ఆంధ్రపత్రికలో వ్రాశిన ప్రకారము తాము యెక్కడైనను దీనాలాపములు ఆడి వుండలేదు. యెవరు యెన్నివిధముల వ్రాసినను తమ యొక్క ఘనతకు లోటు కలుగదు. వకవేళ అభిమానముచేత వ్రాశినను వారివారిమనస్సులలో పశ్చాత్తాపపడుచునే యుందురు. నేను తమసంగతి గుంటూరులో "ఆసనచర్చ" మొదలు యీలాగాయతు వినుటచేతను స్వయముగా చూచుటచేతను యదార్థమును తెలియపరచుచున్నాను, చిత్తగించవలెను.

ఇట్లు విధేయుడు,
యేల్చూరి వెంకటసుబ్బయ్యవ్రాలు.

అనాలోచనపరులగు వృథాశాఖాభిమానులగు నవ్వుపాటుపనుల వలన శాఖకు వచ్చుకళంకమును హరింపఁ బాటుపడుచున్న యీ వెంకటసుబ్బయ్యగారియెడలఁ బ్రాజ్ఞులగు నియోగిశిరోమణులెల్లఁ గృతజ్ఞులుగా నుందురని మానమ్మకము. గుంటూరిసీమలోఁ గుచ్చితవ్రాఁతలు వ్రాయువారు పలువురుగలరని లోకము తలఁచుచున్నదేమో కాని యట్టివారియొక్కయు వారిం బ్రేరేపించువారియొక్కయు సంఖ్యకడు స్వల్పముగనే యున్నదనియు యోగ్యులే విశేషించియున్నారనియు నిఁకనేని లోకమెఱుఁగుఁగాక. కొందఱు కొన్నియపశతపవ్రాఁతలు వ్రా

సిరి కాని యింతకు మున్ను దహరించిన పో — తరాజు లక్ష్మీనరశింహ కవి యనునతఁడు వ్రాసినంత యువకతవక వ్రాఁతను వ్రాసినవాఁడు కన్ప ట్టఁడు, మానమ్మిక నచుసరించి యీలక్ష్మీనరసింహమేని యింతపాపపు వ్రాఁత వ్రాయఁదగు మాని పె యనియోచఁ జాలము కాని పాప మితని కిహపరములు రెండుకు జెడఁదీయ నుద్యమించి ప్రోత్సహించినవాఁడు మనోరంజనీపత్రికాప్రవర్తకుఁ డగుకాళ్ళకూరి నారాయణరావుగారని యెంచ వలసియున్నది. ఇతఁడు పాశివెంకటస్వామివంటియోగ్యునే కొంతవఱకు నయుక్తప్రసంగములోనికి దింపినభయవిరహితశాఖాభి మాని, అట్టివాని కీపో — తరాజుగా రెంత సోదరకవులుగూడ నితనిక ఱఁదలకు లోనై తమకుఁ గలయోగ్యతను గోలుపోయినట్లు 'సీమ' లోఁ బ్రాఙ్ఞులు చదివి యుందురు ఈనారాయణరావే గన్నవరములో మాశివరామశాస్త్రినిగూర్చి పాడువ్రాఁతలు ప్రచురించినసాహసి, భవ తు, అతని కేమి లోటు ఇంతకన్న నతని కేమి కావలెను.

శ్లో॥ "లజ్జామేకాం పరిత్యజ్య త్రిలోకవిజయీభవేత్"

ఇతనిని గాటముగా సుదర్శినియు ఆర్యమతబోధినియు మందలిం చినవి అయినను నితఁడు తన సహజగుణము నిప్పటికిని విడిచినట్లుతోఁ చదు. ఇతనిసాహసమునకు నసహ్యపడునియోగిశిఖామణు లనేకులు గలరు కాని యందఱకు లుదాసీనులు కొందఱు తమకుఁ గలఖేదము ను బత్రికలలోఁ బ్రకటించియున్నారు. మ॥రా॥రా॥ కృత్తివెంటి గం గరాజుపంతులవారి హితోపదేశము నీక్రిందఁబొందుపఱచుచున్నారము.

(19 ఏప్రియల్ 1913 సం॥ కృష్ణాపత్రికనుండి)

## వేమవరపు శతావధానము

---

వేమవరపు శతావధానమునుగూర్చి మనోరంజనిలోని "ముఖ మస్తి" కుకల్పనలు "గజం మిథ్యాపలాయనంమిథ్య"

"పృచ్ఛకుని నీవుమంగళార్థముగా లక్ష్మీస్తుతిగాని నారాయణ స్తుతిగాని కోరుకొమ్మనిరి." ఈవ్రాత యసత్యమైయుండవలెను. దేవతోద్దిష్టముగా కోరుకొమ్మన్నంతనే మంగళసిద్ధియగుచుండగా దేవతా విశేషము నుద్దేశించి కోరుకొమ్మనవలసియుండదు. ఈకల్పన వ్రాసిన వారివంటి బుద్ధిమంతులు తిరుపతి వేంకటేశ్వరులు కారు. కారు.

"వేంకటశాస్త్రిగారు శ్రీవంతం...కృపావంతం అనిచెప్పిరి. శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారు శ్రీవంతమా శ్రీమంతమా అనిరి. వెంకటశాస్త్రిగారు శ్రీమంతం అఁదిద్దుకో అని దిద్దించిరి. సభ్యులలో కొందరు మొదటనే దిద్దించుటా అనిరి."

ఈవ్రాత పట్టపగటిదొంగతనమును జ్ఞప్తికిగొల్పుచున్నది. ఏమాత్రపు సంస్కృతజ్ఞానముకలవాడేని శ్రీమచ్ఛబ్దమును సరిగానుచ్చరించెడిని. అట్టిచో వెంకటశాస్త్రిగారు శ్రీవంతం, అని చెప్పిరనుటకన్న వేమవరమె రాలేదనికాని లేక భూమిలోపుట్టనేలేదనికాని వ్రాసినచో గొంత నమ్మవర్హముగానుండునేమో? ఎందుకు పనికిరానివారినిగూర్చి యిన్ని పత్రికలలో నిన్నివ్రాతలు, వారిప్రక్కను మనకవిసోదరుల కానసము గోరుట యెందుకో అని సందియపడవలసివచ్చుచున్నది. ఓపోతరాజు లక్ష్మీనృసింహముగారూ! గుంటూరులో వివాదజరిగినదిమొదలు నిన్న మొన్నవరకును వ్రాసినవారు తమపేళ్ళనుదాచుకొని క్రొత్తపేర్లను పెట్టుకొని వ్రాయుచుండెడివారు. ఆయాచారమునువదలి మీనామమును బైకిబెట్టుటకు సంతసింపవలసియున్నది. కాని శ్రీవెంకటశాస్త్రిగారికి శ్రీమచ్ఛబ్దోచ్చారణమేరాదనివ్రాసినమిమ్మెట్లుక్షమింపగలము? కావున మీవ్రాతయం దేవాక్యముకాని సహృదయులు కైకొనరాదు. కైకొన్నచో ప్రాజ్ఞతకులోటు. తిరుపతిశాస్త్రి నాను దశావతారములు

బాగా తెలియవు అనిరి" వారట్లందురుగాక! అది మనమువిశ్వసించుట మనబుద్ధిమాంద్యమును దెలుపుకొనుట. తిరుపతిశాస్త్రిగారికి దశావతారములేవో తెలియవనుటకన్న ఓనమాలురావని వ్రాయుటలో భేదమేముండునో ప్రాజ్ఞులెరుగరా. పాపము ఆపత్రిక నడుపువారివ్రాతలు మీవ్రాతకన్నను శోచ్యస్థితిలోనున్నవి. లోకమేమనుకొనుచున్నదో మీయుభయులును విచారించుచున్నట్లులేదు. ఈలాటి మనవ్రాతలే గుంటూరుసీమయను నొకగ్రంథమునకు బీజములైనవనియేని మీరు యోచింపకున్నప్పుడు నేనేమనగలను? వలసైనచో ఆసీమలోని యంశములను సప్రమాణముగా ఖండింపుడు. లేదా తప్పెరిగి మిన్నకుండుడు. ఇప్పటికే మనబుద్ధిమాంద్యము పూర్తిగా లోకమెరిగియున్నది. ఇంకను కనులు తెరవకుండుట కర్థమేయుండదు. భక్తియున్నవారికొరకై యేవో యత్నములొనర్చిన నయ్యవి దైవవశమున పగయున్నవారికుపకరించుచున్నవి. మనబోట్లవ్రాతలయందలి యనాలోచనపుబనులు పెద్దపెద్దలకు నపయశమునీయగడంగుచున్నవి. నావ్రాతయం దేమాత్రమైన సారమున్నచో మీరు గ్రహించి యిదివరకు మీరుజేయుచున్నయత్నములు గట్టిపెట్టుడు. లేదా తగినంతసమాధానమును జెప్పి నన్నుగూడ మీలో జేర్చుగొనుడు. మనశాఖ సర్వవిధముల నిదివరకే ప్రశస్తికెక్కి మహోన్నత పదవియందున్నది. ఇట్టినియోగమునకు నీపిచ్చిపిచ్చివ్రాతలు లేశమును దోడ్పడవలసిలేదనియు పైగా నియ్యవి కళంకము నాపాదించెడినేమోయనియు సంశయించి నాయెరిగిననిజమును వ్రాసియుంటిని. ఈపైని మీయిష్టము.

కృత్తివెంటి గంగరాజు.

ఈగంగరాజపంతులుగారు సంస్కృతభాషయందుఁ దగుప్రవేశ

ముకలవారు, ఐశ్వర్యవంతులు, ఇట్టివారికి గొంటర్ర్రాఁత లెల్లు విశ్వాసపాత్రము లగును? ఎవరెట్లు చీవాట్లుపెట్టినను తలఁకక తమకై పాడు వ్రాఁతలను వెల్లడించుచున్న పోతరాజుగారియెడల నేమి ఆయన వెనుకఁ దాళము వాయించుచున్న కాళ్ళకూరిరావుగారియెడలనేమి మాసోదరకవు లెంత యనుగ్రహము నేని వినియోగింపఁ దగువారు.. పోతరాజుగారు సర్వవిధముల దగ్గఱివారు గాన నేదోవిధమునఁ బ్రత్యుపకారమును బొందుట కవకాశ ముండును గాని కాళ్ళకూరిరావుగారు చాలదూరగులు. వీరికొఱకై యేవిధమైనయుపకృతినో యోజించి సోదరులు కృతకృత్యులై నీఋణులు కావలసియున్నదని హెచ్చరించుచు మఱియొకప్రాజ్ఞుఁడు వీరివ్రాఁతల నెట్లు గర్హించుచున్నాఁడో చూపుచున్నారము.

(౧౬వ ఏప్రిల్ ౧౯౧౩ సం॥ ఆంధ్రప్రకాశికనుండి)
కవిదూషకహితోపదేశము.

---

ఓకవిదూషకులారా? మీరు వార్తాపత్రికలలో......వేమవరపు శతావధానమనియు, తిరుపతివేంకటేశ్వరులకుఁ బ్రత్యుత్తరమనియు, ఇత్యాదిశీర్షికలక్రిందఁ దిరుపతివేంకటేశ్వరాద్యాధునికకవివరులను ముందువెనుకలు విచారింపక తిట్టుచుంటిరే? పుస్తకము లమ్మికొని పొట్ట నింపుకొనువారలని వ్రాయుచుంటిరే? పండితులు...లని వ్రాయుచుంటిరే? ఆహా? మీరిటుల నితరులఁ దిట్టుట పాపహేతువని యెఱుఁగరే? అందును విద్వత్కవుల దూషించుట మీకు ఘోరనరకమూల మని తెలియదా? మీరటుల వ్రాయుట మంచిదా? అసత్యపువ్రాఁతల వ్రాయుచు, సత్యవాది, హితవాది, భాషాభిమాని మొదలగు సంతకము

లతోఁ బ్రచురించుట పాడియా? ...ఏమికాలము సంభవించినది అక్క-టా? "పూర్ణశుంఠలు సభాపూజ్యులైరి" అనునార్యవచనము నిక్క-మగునేమో యని భయము గలుగుచున్నది. తిరుపతివెంకటేశ్వరులు ...వ్రాసిభాషకుపకారము చేసినసంగతియు...గురున కంకితముచేసినసంగతియు.. శిష్యనికరమున కష్టావధానాదులఁ నేర్పి వ్యాకరణాదిగ్రంథములఁ బారము చెప్పి వారు వాసిగాంచినటులఁ జేసినసంగతియు మఱియుఁ దమపొత్తములమొత్తమును గోరినవారికి నుచితముగా నిచ్చి వారిని సంతోషముగలవారినిగా నొనరించినసంగతియు...దెలిసికొనక యూరక యిటులవ్రాయుట భావ్యమా? కాదు, కాదు, ముమ్మాటికిని గాదు, కాఁబట్టి యికనైనను ధీమంతులు, వివిధప్రబంధగ్రంథనిర్మాణధౌరేయులును పరోపకారధురీణులును, నీతిమంతులును, భాషాభిమానులును నగుశ్రీతిరుపతివెంకటేశ్వర్లు మొదలగువారిని దూషింపకుఁడు, నాహితోపదేశమును వినవలయు నని కోరుచున్నాను.

(చిప్పకుల అప్పయ్యశాస్త్రి.)

ఆయీగతుల దూరస్థులగు ప్రాజ్ఞులు చీవాట్లిడినను దమసహజదురుద్యమమును వదలనిసోదరపక్షపాతులవ్రాఁతలను లోక మెంతవఱకు విశ్వసించుచున్నదో యీక్రింది యుత్తరములవలనఁ దెలిసికోవచ్చును.

(1) "......తమవద్దనుంచి యీమధ్యవుత్తరము లేవియురానిహేతువుచేత మీక్షేమసమాచారములు తెలియుటలేదు. పేపరులో వ్రాసినవ్రాఁతలు మీసత్తమెరుగనివారువ్రాసినట్లు తలచెదము, గాని మీసామర్థ్యము తెలసినవారు యథార్థముగానే వ్రాసినారు......

సా॥ చింతామణి.

(2) "......ఆంధ్రపత్రికలో మీయవధానమునుగూర్చి యెవరో యొకమత్సరి కలముపరుగెత్తినట్లుల్ల వ్రాసినయొకఅసందర్భపువ్యాసమును జూచితి......అందులో వ్రాసినరీతిని తమకుగాదుగదా? తమపాదభక్తులగు శిష్యపరమాణువులకుఁగూడఁ దటస్థింప దని నానమ్మకము.

పు-సూ-నా-తీర్థులు.

(3) '..... ఆంధ్రపత్రికవలన మీరొక శతావధానమొనరించినట్లును దానియందనేకలోపములు గలిగినట్లును అందలిసభ్యులచే మీరు నిందితులైనట్లును నేను చదివి.... .ఈపత్రికయందుండుసంగతి సత్యమని నే నెప్పటికి నమ్మజాల. దయ యుంచి మీరు దానియొక్క నిజవృత్తాంతమును దెలుపగోరెదను.

కే. వి. శేషాద్రిశర్మ.

ఇట్టియుత్తరములు పెక్కులు. ఇందొకటిమాస్వగ్రామమగు గోదావరి డి॥ యింజరమునుండియు, వేఱొకటి మాడుగులనుండియు, నింకనొకటి కడపనుండియు వచ్చినవి. మమ్ము నిందించువా రనామకులనియు నశ్రద్ధేయులనియు లోకము బాగుగ నెఱిఁగియే యున్నను నీకతృణములకొఱకింతపరిశ్రమచేయుట లోకారాధనకొఱకని ప్రాజ్ఞులు నిర్ణయింపఁ గోరెదము—అనామకులను సనామకులుగా నొనర్చునీమాయత్నమున కెవరో యననేల? మాశిష్యులే కొందఱు చేవపడుచున్నారు.

"......ఏవ్రో వ్రాయుదురుగాక వాండ్రవ్రాఁతఫలము వారినే చెందెడిని.. దీనివల్ల ననన్యాదృశప్రతిష్ఠాధుర్యులకు లాఘవమును, ఏపేరును లేనియనామధేయుల కొక్కించుక కీర్తిలాభమునకును అవకాశముగల్గుచుండును. క్షమధ్వ మపలాపధార్ష్ట్యమ్.

శిష్యుడు, అవ్వారి సుబ్రహ్మణ్యము.

ఇట్టిబోధలవలననేమి స్వయముగానేమి మాయొనర్చుపరిశ్రమ మనామధేయులను సనామధేయులను జేయునదియని యెఱింగియు సంశయగ్రస్తమగుదూరదేశస్థితజిజ్ఞాసులోకమునకై యీపరిశ్రమ కవకాశమీ వలసినవారమైతిమి. అందుల కీక్రిందియుత్తర ముదాహరింపఁబడుచున్నది.

"......వేమవరపుశతావధానమునుగుఱించి తమరు శ్రద్ధవహింపకతప్పదు. అందునిజానిజములను తిన్నగా తెలుపవలెను, మఱియును గడువు చేయక త్వరపడుట యుక్తముగా నుండు నని తెలుపుకొనుచున్నాను.

కే. వి. శేషాద్రిశర్మవ్రాలు.

ఇట్లు దూరస్థులెల్లఁ ద్వరపెట్టి మాకుఁ బ్రోత్సాహము కలిగించుటకుఁ గారణము పరిశీలకతాజ్ఞానశూన్యములగు పత్రికలుఁదక్క వేఱు కాదు. పేరికున్నమాత్రము పరిశీలకతగూడ లేనివారు పత్రికలు నడుపుటవలన లోకమునకుఁ గల్గునష్ట మెట్టిదియో ప్రాజ్ఞులు విచారింపఁదగువారు. దీనినిటులుంచి వేమవరావధానమునకుసంబంధించిన వేకొన్ని పద్యము లుదాహరించుచున్నారము.

" వేమవరాగ్రహారము—తిరుపతివెంకటకవులు.

శా॥ గద్వాలాదిసమస్తభూనిలయ విఖ్యాతాంధ్రగీర్వాణ భా
షాద్వంద్వాశుకవీంద్రు లౌర? తమవాక్సారంబు నల్దిక్కులం
దుద్వేగంబునఁ గీర్తి నొంద నవధానోద్యోగముల్ చేసి రీ
విద్వద్వంద్యులు, వారిఁ గాంచితి బళీ? వేమారమా? ధన్యతన్॥౧॥

ఉ॥ గీరత మన్న భారతము, గీరతు లెల్లరు మెచ్చునట్లు, భూ
భారము నెల్లఁ బోకడచు బాధ్యతమై రచియించినార లీ
వీరలు వ్యాసతుల్యు లవివేకపుశిష్యులమేలు గోరి ర
వ్వారలఁ గాంచినా వదిర? భాగ్యము వేమవరాగ్రహారమా! ॥౨॥
ఉ॥ కింకవిరాజమత్తగజకేసరినామము దాల్చినార లే
వంకను వీరిసత్కృతులె పాడుచునుంద్రు కవీశ్వరుల్ వృథా
లెంకలు గొంద ఱేటికో యలీకపువార్తలు వేయుచుందు రా
అంకెలు నైచుమప్కవుల రాలఁగఁ జేసితి వేమరాట్పురీ ॥3॥
సీ॥ కావ్యముల్ రచియింప ఘనకౌశలము లేమి
నాశుఘోషయె గొప్పయనెడువారు
పద్య మొక్కటియైన వ్రాయఁ జాలమిఁ బిట్ట
కత సెప్పి కవులుగాఁ గడఁగువారు
అవధానగరిమంబు నావంత యెఱుఁగకే
"అత్యద్భుతావధా" న్లనెడివారు
వ్యాకృతిపాండిత్యపాశంబులం బట్టి
కవుల బంధింపఁగాఁ గడఁగువారు
తే॥ గీ॥ అన్న? „ కౌముది ” యన నేమి యనెడువారు
కాదు „ కౌమోదినీ ” యని గఱపువారు
విశ్వవిఖ్యాతతిరుపతివెంకటేశ
గారవాత్యుగ్రకవిసింహగర్జితంబు
నెదిరి తూలింపనెంచు టదేటి సుఖమొ
వింతగా నీకుఁ దోఁపదో? వేమవరమ! ॥౪॥

ఇట్లు విద్వత్కవివిధేయులు,

సుందరకృష్ణులు.

యోగ్యులగువారు పలువు రిట్లు వేమవరాగ్రహారావధాన త త్త్వమును వెల్లడించుచున్నను ప్రప్రత్తిపాటి కామయ్యాకో యూతగాం గాని సోదరకవులు వెఱ్ఱిమొఱ్ఱిప్రయత్నములు సేయుచు నపహాస్యాస్ప దులగుటకును స్వయముగా మాయలేఖలు సృష్టించి ఘనులగు వారి ని ధిక్కరింప సాహసించుటకును విచారింపని ప్రాజ్ఞు లుండరని మాత లంపు, గుంటూరి కాలేజీలో నుపాధ్యాయపదవియందుండి యిట్టిసత్య సంధుఁడు, ఇంతపాపభీతి కలవాఁడు, ఇంతయోగ్యుడు "నభూతో న భవిష్యతి" యను యశమున కాకరమై చలిచీమనేని చాఁ ద్రొక్కని శ్రీమాన్ వంగిపురం కృష్ణమాచార్యులు బియే, యల్ టి, గారిమీఁద ను, తాదృశులే యనఁ దగి యీకాలేజీయందే చిరకాలమునుండి యు పాధ్యాయపదవియందున్న బ్ర॥ శ్రీ॥ మల్లాది వెంకటసోమయాజులుగారి మీఁదను నపవాదములను బ్రకటించుటకు వెనుదీయని కొప్పరపుసోద రులకుఁ జేయరానియకార్య మేముండునో మేము నిశ్చయింప నేరకు రము. మాయూహ నొప్పున సోదరకవు లింతటితప్పుసృష్టికిఁ బాల్పడు వారని యిప్పటికిని విశ్వసింపఁ జాలము కాని సహవాసదోషముచే నీ కులవిద్య వీరికిఁ బట్టుపడి యుండవలెను. లేదా? కాకినాడ వెళ్ళివచ్చిన పిమ్మట నుత్తరకుమారప్రజ్ఞలను నోటికివచ్చినట్లెల్ల వ్యయము చేసియు న్న వీరికి వేమవరాగ్రహార శతావధానప్రాభవము వైచిత్త్ర్యము నేని యాపాదించి యీపాడువ్రాఁతలకు దింపియుండవలెను. ఈవైచిత్త్ర్య మును బలపఱుపఁదగులేఖ నొకదాని నిట నుదాహరించుచున్నారము.

(రాజాపేటగ్రామ మహాజనుల యుత్తరమునుండి)

1913 సం॥ ఫిబ్రవరి 15 వ తేదీ కృష్ణలో మానివాసగ్రామమగు రాజాపేటగ్రామమునకు శ్రీ కొప్పరపుసోదరులలో రెండవవారువచ్చి

మా గ్రామస్థులలో కొందరిని పద్యములు చెప్పి నుతించి "తిరుపతి వేంకటేశ్వరులు వేమపరములో చేసిన యవధానము బాగుగ లేదని మహజరునామా వ్రాసికొని వచ్చి అందు వ్రాళ్లు చేయవలసినదిగా కోరి బతిమాలినట్లు శంకరమంచి లక్ష్మీనారాయణశాస్త్రిగారు ప్రకటించిన మాట సత్యము. ముమ్మాటికిని సత్యము. ఇటీవల శ్రీ కొప్పరపుసోదరులలో పెద్దవారు మా గ్రామమునకువచ్చి "తమతమ్ముఁడు రాజాపేట రాలేదు. ఏవిధమైన దుష్ప్రయత్నము చేయలేదు. లోనగు మాటలతో వ్రాసి యీవలశినదిగా కోరెను. అందులకుగా కొందరిమీద స్తుతిపద్యములు చెప్పెను. అందులకు మోమోటపడి కొందరు వ్రాశియిచ్చిరి పిమ్మట పెద్దమనుష్యులకు తెలిసి మందలింపగా వారు మాయుత్తరములు మాకిమ్మని నిర్బంధించిరి కాని సుబ్బరాయకవిగారు చేజిక్కిన బేరముగా మాటలాడ జొచ్చిరి తుదకు వుత్తరములు మరల వుత్తరములు మరల పుచ్చుకొని పంపివేయుట తటస్థించినది. శ్రీ సోదరకవుల కింకనేని సత్యతత్పరత్వమున్నూ, విద్యాభ్యాసాదరమున్నూ కలుగునట్లు భగవంతు డనుగ్రహించుగాక.

ఇట్లు రాజాపేట పురనివాసులు.

(1) ప్రఖ్యా చంచయ్యవ్రాలు (2) పెరవలి అబ్బయ్యవ్రాలు (3) భాగి బ్రహ్మానందమువ్రాలు (4) భాగి నారాయణయ్యవ్రాలు (5) గుంటి వీరయ్యవ్రాలు (6) అవ్వారు పేరయ్యవ్రాలు 7) వంగర వెంకటసుబ్బయ్యవ్రాలు (8) ప్రగడ రాఘవులువ్రాలు, (9) ప్రగడ తాతయ్యవ్రాలు,

సోదరకవుల కిటీవల నలవడిన సువివేకమును దెలుపఁదగు నుత్తరము లిట్టివి వారికొప్పరపు సమీపగ్రామస్థులవి పెక్కులున్నను విస్త

సీ॥ చెలియ కెంగే లని చిగు రంటఁగా నెంచు, వల తేనివి డె మంచు జలదరించు
వనజాక్షి మే నని ననుదీఁగెఁ గదలించు, మరునల్లెత్రా డని మదిఁ దలంచు
తరుణిచన్గవ యని తమ్మిమొగ్గలు గాంచు, స్మరుతమ్మటము లంచు సంచలించు
కోమలినఖ మని కోరకాళి నుతించు, మరుతూపుగమి యంచు వెఱపుఁ బెంచు

గీ॥ నద్భుతం బౌర? కేళీవనాంతరమున । మదనతాపాగ్ని వేదన మరులుకొనుచు
జనవరకుమారవరాళి యాతనివిరాళి । యే మని వచింప రతిపతియే యెఱుంగు 216

క॥ ఆరీతి దెలిసి యుడిగపు । నారీతిలకములు తన్మహఃప్రియ మెసఁగన్
సారశిశిరోపచారము । లారసి వర్తింతు రతని కతిహర్షమునన్ 217

సీ॥ పడఁతిగుబ్బలు కేలఁ బట్టి నట్లాయెనో, నిద్దంపుఁబోడఁ గాన్పునిమ్మవండ్లు
వనిత నెమ్మోము మూర్కొనుచంద మయ్యెనో? ఘుమ్మన వాసించు కమ్మఁదమ్మి
సుదతిబాహాలతల్ సోఁకిన ట్లాయెనో? మేలైనవిరిమల్లెపూలసరులు
మెలఁత పెన్నెఱికొప్పు మెఱసిన ట్లాయెనో?, చెలి వైచు నెమలీకె చికిలిసురఁటి

గీ॥ యజున కౌరౌర? విరహార్తివేళ । భావ మెఱిఁగినచెలులు సంభావనార్హ
గరిమ నుపచారములు సేయఁ గాకయున్న । దర్పకునిబాణవేదన దాళఁగలఁడె 218

సీ॥ ఉపచార మొనరించు నెపమున నొకయింతి, మిగులఁ బన్నీరు నెమ్మేనఁ జిలికె
నిది వింత సౌరభం బెనసెఁ జూడు మటంచుఁ, గలికి యొక్కతె చాల గంధ మలఁదె
నే నలంకృతి సేయ నేర్తు నం చొకయింతి, హురుమంజిముత్తెపుసరులు వైచె
నివి మంచివే యెంచుఁడీ యంచు నొకయింతి, జిలుఁగుఁజెంగావులు చేతి కొసఁగె

గీ॥ నెలమి నృపసూనుమనసు రంజిల మెలంగు । డిందుమతి గలవా రెవ్వ రీయజాండ
ములఁగు నోయమ్మ? యితరు లెఱుంగ రనుచు । నతని కాహ్లాద మొనరింతు రనుఁగుచెలులు

ఉ॥ సైగకు సైగగా నిజలజాతముఖుల్ శిశిరోపచారముల్
వేగ నొనర్పఁ గొంతపృథివీవరసూనుఁడు తాళెఁ గానిచో
రాగ మెలర్ప నిందుమతి వ్రాసినచిత్రపటంబుఁ గన్నచో
నేగతిఁ దాళ నేర్చు నసమేషుసుమాస్త్రపరంపరాహతిన్ 220

క॥ నటదంభోరుహబాణ । స్ఫుటతరశరపాళిపాతముల బాధితుఁడై
యిటులారాసుతుఁ డుండఁగ । నట విప్రవరుండు వేగ హర్షస్ఫురణన్ 221

క॥ తనరాక కెదురు గన్గొను । ఘనరాకాచంద్రముఖిని గని రాసుతువ
ర్తన మెంతయు విశదంబుగ । వినుపింప విదర్భునకు వేడుక నరిగెన్ 222

వ॥ తదనంతరకథావిధానం బెట్టిదనిన 223

క॥ శరణాగతరక్షాగుణ । భరణా తరుణారవింద భాస్వరచరణా
కరుణారసభరితాంతః । కరణా ధరణీసమానఘనసహనచణా 224

శా॥ అక్షీణప్రతిభాధురంధర ధరాధ్యక్షుస్తుతోంచత్కృపా
వీక్షారక్షితసత్కవీంద్ర! సురరాడ్విఖ్యాతశౌర్యోదయా
పక్షీడ్వాహనపాదపద్మయుగళీ భక్తిప్రియంభావుకా
దాక్షిణ్యాకర! శ్రీకరానుపమహృద్యత్పద్యశోవైభవా 225

పంచచామరం

సదాసదాభిరామ్యయుక్తసత్యభావిభాసితా
నదీనదీనతాప్రదాయినవ్యదానతత్పరా
వదావదాంధ్రసత్కవీంద్రవర్ణ్యమానవిక్రమా
స్పదా పదానతారివీర భక్యధీధురంధరా 226

గద్య.

ఇది శ్రీమదఖండ సచ్చిదానంద కాశీపతిసద్గురుస్వామిచరణారవింద సేవాసమా -
గతస్వస్వరూప జ్ఞానరాజయోగ సామ్రాజ్యలక్ష్మీధురంధర జ్ఞానప్రసూ
నాంబికా కాళహస్తీశ్వర కరుణాకటాక్షవీక్షణసంప్రాప్తసార
సాహితీబంధుర బంధురంజనకరచరిత్ర పాకనాటికుల
పవిత్ర ధూర్జటిపౌత్ర కాశయామాత్య లక్ష్మమాం
బికాకుమార కుమారధూర్జటిప్రణీతంబైన
యిందుమతీపరిణయంబునందు
ద్వితీయాశ్వాసము.

# ఇందుమతీపరిణయము.

## తృతీయాశ్వాసము.

క॥ శ్రీమహిళాశ్రితమందిర । భూమీసురవర్యనిరతపోషణచర్యా
భామాధికతావిజితవ । భోమణివరసాప్పరాయభూపాలమణీ 1

గీ॥ అవధరింపుము శౌనకాద్యఖిలమునుల । కనుపమస్వాంతుఁ డగుసూతుఁ డనియె నిట్లు
ప్రౌఢి శివశర్మ కార్యసాఫల్యగరిమ । కలరి కుండినపురిఁ జేర నరుగుదేర 2

ఉ॥ ఆసమయంబునన్ జలరుహాక్షులు నివ్వెఱఁగందఁ జింతతో
గాసిలి యుండి యుండి తమకంబున గుట్టుసియాడుచుండఁగా
వాసరనీజనేత్ర కలయందుఁ గనుంగొనినట్టిప్రాయపుం
రాసుతునాత్మ నెంచి వలరా-బలురాయిడి కోహటించఁగన్ 3

ఉ॥ అమ్మకచెల్ల! యేమెఱుఁగ డారయ మొన్నటిచిన్నబాల యీ
యమ్మ మహావిచిత్ర మిది యక్కట! యెక్కడినుండి వచ్చెనో
యిమ్మనుజేంద్రపుత్రికి సహింపఁగ రానివిరాళి పైపయిన్
గ్రమ్మె నటంచు నొండొరుల గక్కున మక్కువఁ బల్కి రయ్యెడన్ 4

ఉ॥ నిన్నటిబాల వింతె తరుణీమణి! యెన్నఁడు నేర్చినావె? యీ
చిన్నెలు వన్నెలాడి? యలచిత్తజుబారికి నగ్గమైనరా
కన్నెలు లేరె? నీకరణి గానము, గానము సేయ రాదొ? మే
ల్వన్నెలఁ దాల్ప రాదొ? చెలువా చెలువానక యుండఁ జెల్లునే 5

సీ॥ అంచలఁ జరియించునంచబోదలపింపు, చెమ్మి ముంగలనాడు నెమ్మి ఱేఁడు
కరముపై నాడుశ్రీకరమైనకీరంబు, కరము తీరౌడంబుకలరవంబు
మీఱఁ కోరికఁ దెల్పుశారికానికరంబు, కన్నుడా లెనఁగూడుకన్నెలేడి
కాకలీరమణీయకోకిలానీకంబు, చెలువంపుగమిసొంపుచెలులగుంపు
గీ॥ పెంపెడల నిట్టియెడ నీవుసొంపు సడలి । తుఁటవిలుదంటగొంటరితంటలకును
దీన్నదన మతి విన్ననై ఖిన్న వగుచు । వేడ్క దొరఁగంగ నేటికీ వెలఁదిమిన్న 7

క॥ కలలోఁ జూచినమాత్రన । నిల లేక తపింపఁ జెల్లునే? లలితాంగి
తెలియఁగ జాగ్రత్త్వమ్మున । నలరాసుతుఁ గన్న నెంతయలవుట పడెద్దో

సీ॥ సింగారపు కొసంగుఱుంగారుకుంగురుల్, చిన్నారినుదుటిపైఁ జెదరెనమ్మ
బలుతుమ్మెదలఁ బల్కావలవంతమడులచే, వదనారవిందమ్ము వాడె నమ్మ
బెట్టుగ నిగుడించునిట్టూర్పు వేఁడిచే, చిగురాకుకెమ్మోవి నొగిలె నమ్మ
మున్నీరుచందానఁ గన్నీరుసోనలు, మోడ్పుకన్నులనిండ మొనసె నమ్మ

గీ॥ చిటిలె గందమ్ము హారాళి నెటిలెనమ్మ। మెఱుఁగుసెమ్మేనఁ జెమ్మటల్ మించె నమ్మ
కమ్మవిలుకానితూపులఁ గ్రమ్మకాఁక । ముమ్మరం బయ్యెఁగదవమ్మ ముద్దుగుమ్మ

చ॥ జలకములాడవే? సొఱుఁగు సైకపువల్వ ధరించవే? సము
జ్జ్వలఘనసారసమ్మిళితచందనపంకము మైఁ నలందవే
కలుకుమిటారిచన్నుగవ క్రొత్తసుపాణిసరంబు లుంచవే
దళముగఁ గొప్పుపై విరులదండలు మెండుగఁ దాల్పవే చెలీ

వ॥అని యిత్తెఱంగునఁ గురంగనయనలు కురంగటం బల్కు పల్కులకు నచ్చిలు కలకొలికి యళికి యళికీరపాళికలహాళాహాళికి మలికి పడి వడి నిగుడ వెంబడిం బడి చిడిముడిపాటునం దడబడి యెడనెడ వెడవిల్తుం డడరించు చురుకుచురుకున నెఱకలు దాఁక సోఁకి బెరుకు గల్పించుకఅకుచురుకుటలరుటంపరల పెం పలర నింపలర రాక రాకానిశాకరకరసంఘాతంబు జాతవేదఃకీలాకలాపంబులపోలిక న్గీలుకొనఁ జాలువాలు కనుదమ్ములం గ్రమ్మకొను బాష్పపూరంబు తోరంబు గాఁ జక్కనిమిక్కుటపుచెక్కు టద్దంబులచక్కటి న్బిక్కటిల జాతి చారుతరస్తనాలంకారహారంబు డంబు విడంబింపఁ బ్రకంపమానగాత్రయై చిత్రార్పితప్రతిమచందంబున నిశ్చేష్టిత యగుచు వెడవెడ నగుచు కొంతసే పూరక యుండి యుం గ్రమ్మఱం దెలివొందుచు నిశ్వాసోష్ణవివర్ణీకృత నాసావిభూషణముక్తాఫలయు ముహుర్ముహురుచ్చలత్తారహారయుఁ దనుతాపతప్త కాంచనాభరణయు విస్రస్తకబరీభరసుమదామయు శ్రమాంబుధారాధౌతస్తనద్వయలిప్తచందనయు నగుచు విరులపాన్పునం బొదలునెడ నెడ దొలంగుపయ్యెదచెఱంగు మెఱుంగుపాలిండ్లతెఱంగు బయలువఱుప నిడువాలుపెన్నెఱులు జాతి తనూలతాప్రార ధంబునకుం గ్రమ్మిన తుమ్మెదలయొమ్మె దలపింపుచు వెండియు హృదయగుహామహా హారంధతమసంబు బయలు మెఱసినట్టు గనుపట్టఁ బట్టరానిగుట్టున నెట్టనం దిట్టగిలఁ బడి యారాపట్టి యెట్టకేలకుఁ కట్టెదుట నెట్టుకొని యున్న సఖీఘట్టంబుతో నిట్లనియె. 10

ఉ॥ అన్నియుఁ జెప్ప వచ్చుఁ గుసుమాయుధుఁ డుగ్రత శాస్త్రహాంబునన్
గ్రొన్ననచిల్కుటంపరలు గ్రుచ్చిన నొచ్చిన నోర్వవచ్చు నే
యెన్నఁటి కాన్నృపాలసుతు నెంతయు సంతస ముప్పతిల్లఁ గా
మోన్నతిఁ బెండ్లి యాడఁగలనో? లలనామణులార! దెల్పరే 11

సీ॥ మిడియెండవలె నుండువడి నిండ మైఁ జెందు, సుధుమవెన్నెలకాఁక లోర్వ రాదు
కార్చిచ్చుతోఁ జెల్మి గన నేర్చుదగ నేర్చు, మలయానిలము వేఁడి నిలువ రాదు
కర్ణశూల మనంగ దుర్ణయంబు చెలంగ, వెలయుకోయిలసద్దు వినఁగ రాదు
విలుకలాడినపోల్కి బెళుకు వీనులఁ జిల్కు, చిలుకపల్కులబాధ మేఁగ రాదు
గీ॥ తుమ్మెదలదిమ్ముగొద తలచి మ్మొనగ్వ। దర్పకునిదర్పఘనలీల తాళఁ జాల
నోర్పు గలవారు మీరు నన్నూఱడిలఁగ। నేర్పు లిటఁ జూప రాదఁడీ నెలఁతలార!

ఉ॥ అల్లద్విజుండు రాఁడు తడవాయెఁగదా? నరనాథవందనుం
డుల్ల మెలర్ప నన్వినియెనో విని యుద్వహనేచ్ఛ యాత్మలో
నుల్లసిలంగ నెంచెనొ మఱొక్కతె నెవ్వతెనైన నెంచెనో
పల్లవపాణులార! యలభావజుబారిఁ బడంగ శక్యమే 18

మ॥ కలలోఁ గన్ననృపాలశేఖరుని వేడ్కం జూచు టెన్నండొకో
యిలకేఁ డన్నరనాథవర్యునకు నన్నీయంగఁ బెండ్లాడి నా
తలఁపుల్ మీఱఁగ మానసాయకునిబంధాగా వితర్కించుచున్
చెలువుం డెన్నఁడు గౌఁగిలించునొ? సుఖశ్రీ గాంచు టెన్నం డొకో 14

సీ॥ వానిచక్కదనంబు పూని చూచినఁ గాని, దిగులు దీరదుసుడీ మగువలార
వానికెంగేలు నాపాణి నంటఁగఁ గాని, మేనితాపము వోదు మెలఁతలార
-మ్యానుపుటింటిలోన నిల్చినఁ గాని, కొంత నెమ్మది గాదు కొమ్మలార
వానికౌఁగిటఁ జిక్కి వలపు మించినఁ గాని, వలవంత దీఱ దోవనితలార
గీ॥ వానియురమున బిగిగుబ్బ లానకున్న। వానిచక్కెరకెమ్మోవిపానకమ్ము
లానకున్నఁ దిరం బయి మానకున్న। నామనోవ్యథ దీర దోభామలార 15

మ॥ అని యారాజకుమారికామణి మనోజాలీఢగాఢాస్త్రవే
దనకుం జాలఁగ లే నయోయనుచు, గెం-దళ్కుంగపోలంబునం

దనచేనేల చెఱంగు చాటిడుచు గంధర్వాంగనావల్లకీ
ఘననాదంబు చెలంగ నేడ్చె నుడుకుం గన్నీరు మున్నీరుగన్॥ 16

సీ॥ శ్రీకృష్ణఘనరూప జితదానవకలాప, రాహుభిత్కోప శార్ఙ్గధరచాప
శివసన్నుతవిలాస నవహేమమయవాస, చాంపేయసుమనాస చారుహాస
వాయునందనచిత్ర వాగ్వర్ణితచరిత్ర, కమలారిరవినేత్ర కదనజైత్ర
వార్ధికాంబుదరీతి వత్కృపాసంపాతి, వనధివాసఖ్యాతి యనుచు క్షితి
గీ॥ పెఱలు సొలలును బోడలు బిట్టరవి తెరలు । చానలముఖాక్షివక్షోజ జఘనవత్స
చంద్రికాస్మరమేఘహంసాధినాథ । గుణవిరోధ్యవిహారాంక గణన దనర॥ 17

ఉ॥ ఇమ్మెయి నుమ్మలింపుచు మృగేక్షణ యూరకయున్నఁ జూచి యో
యమ్మఁ యిదేటికాఁక జలజానన మూర్ఛిలె నంచుఁ దత్సఖుల్
నెమ్మదిలోన జింతిలుచు నేరుపుతో శిశిరోపచారముల్
సమ్మతిఁ జేయ నెంచి సుమసాయకు నాత్మఁ దలంచి మ్రొక్కుచున్॥ 18

సీ॥ మెఱుఁగు పెన్నెఱులపైఁ గురువేరు సవరించి, నెమ్మోమునందుఁ గెందమ్మి లుంచి
కన్నుల విరినల్లకల్వ రేకులు దార్చి, గళశంకమున మౌక్తికములఁ జేర్చి
బాహువల్లులయందుఁ బటుమృణాళము లుంచి, హస్తంబులఁ గుశేశయములు పూన్చి
చన్నులఁ బుష్పగుచ్ఛమ్ములు పమకూర్చి, పొక్కిలి నునుపొన్నపూ వమర్చి
గీ॥ విలసితోరుల ననఁటిమోవు లెనయించి । లలితపదములఁ జిగురాకు లలవరించి
అందముగ మేనఁ బన్నీటిగంద మలఁది । సలిపి రింతికి శైత్యోపచారవిధులు॥ 19

వ॥ అంత॥ 20

క॥ ఘనతాపకరం బయ్యెన్ । ఘనసారపటీరగంధ కలనము సైఁపన్
ననుబోఁటికి వశమే యని । వనబోఁడి గలంగెఁ దనమనం బెఱియంగన్॥ 21

గీ॥ ముదిత కప్పుడు శిలీముఖమ్ములు శిలీము । ఖమ్ము లయ్యెను ఖగములు ఖగము లౌఁగ
పరిమళమిళచ్ఛరమ్ములు శరము లయ్యె । నార? విరహానలంబు మై నగ్గలింప॥ 22

చ॥ అలకలకంఠి తాపభర మంది కుచద్వయహారవల్లరుల్
పెళపెళఁ బేలగింజ లయి బెట్టుగ మిట్టిపడంగ శయ్యపై
నలరుప్రసూనముల్ కిసలయాదికముల్ వసివాడగందముల్
గళకళ లాడఁగాఁ గని పికాళిక వైరి వధూటు లందఱున్॥ 23

సీ॥ చెలి! శివశర్మ వచ్చెఁ టంచుఁ బల్కవే యలరువిల్తునిగర్వ మణఁగుఁ గాని
యజసమాగమనవిఖ్యాతి వచించవే యంచలనడక క్రిందౌను గాని
చక్రీశ్వరకథాప్రసక్తి గణింపవే మలయమారుతధాటి నిలుచుఁ గాని
యుత్తమస్ఫూర్తిశుభోక్తి వర్ణింపవే కలువనెచ్చెలివేఁడి దొలఁగుఁ గాని

గీ॥ యనుచుఁ జాతుర్య మెనయ నెచ్చెలులరుఁబోండ్లు, పంచశరునిధదీయ వాబలముకోఁడ
గూడ బెదరించుపోఁడుము లాడుకొనుచు, నిందుమతిఁ జూచి వేవేగ నిట్టులనిరి 24

క॥ ఉపచారం బొనరించిన నపచారం బయ్యెనే మొ యతివా? నీ క
య్యుపవనసీమఁ జరించిన నుపశమనం బగును గొంత యూఱట గాఁగన్ 25

క॥ రా రమ్మనుటయు నపుడా నారీరత్నము మనోజనాళీకశరా
సారహతికోర్వ కటు శృంగారవనంబునకు వెడలఁగాఁ దలఁచి మదిన్ 26

సీ॥ పంచశరాగ్నితాపజ్వాలికామాలి, కల హెచ్చు నిట్టూర్పుగాడ్పుతోడ
నంచనేతెంచు రాయంచజాడ నదల్చు, కళుకుటందెలవళావళులతోడ
చేరి చేలాగిచ్చుచినయూడిగపుఁగూర్మి, డెందంపుఁబ్రోడచేడియలతోడ
విసువొందునొసపరిమిసిమిమేనికడాని, తళుకునిగ్గులవసంతములతోడ

గీ॥ మ్లానకబరీభరస్ఫురన్మాల్యవాస, నాగతమిళింద ఝుంకార నటనఁ జూడఁ
జూడ వేడుకగాఁ జెలుల్ పొరదిఁ బట్టు తలిరుటరిగెలక్రింమున వెలయునీడ 27

సీ॥ మెట్టదామర లంచు మెట్టఁ బోయిన యంచ, లట్టిట్టుకాఁక చే వలవఁటించ
నీలోత్పలము లంచు నిండినతుమ్మెదల్, కడుఁ దాపమును జెంది కళవళింప
జిగిదొండపం డంచుఁ జేరవచ్చినచిల్క, బలువెట్ట దిగుల్గొంది పరువు లిడఁగ
జ్యోత్స్న యటంచు మెచ్చుచుఁ జకోరికఁ జేరి, యుడుకుసోఁకినదూరముఁబుకఁదొణఁగ

గీ॥ తరుణలాక్షారసార్ద్రపాదములఁ జూడఁ బ్రేక్షణాధరతనుపొందువిభల వెలయ
రాజముఖి మందమందమురాళగతుల నతులశృంగారవనములకు నరుగుదెంచె 28

క॥ పల్లవితైలావల్లీ హల్లీసకమల్లికాలతాంతనితాంత
ప్రోల్లసితసౌరభంబుల నుల్లం బలరించుతరుసముత్కర మెసఁగన్ 29

సీ॥ ఒకచాయవికచాయుతకచాయ సుమపాళి, కలబాళిగలబాళికలు మెలంగ
నొకదండ శుకతుండ శికకాండధృతపత్త్రపలలసత్కిసలసంతతి వెలుంగ

కోకచోట వికచాటవికపాటలీఝాట పాటీరవాటీవిభల్ సెలఁగ
సొకమేర సుకుమార సకుమార కరవీర, వరవీర తరు సముత్కర మెసఁగ
గీ॥ రంగదుత్తుంగ భాస్వదభంగభంగ। సంగసంగీతకృద్భృంగజలజసంఘ
సారకాసారసంచార సరసగంధ। వాహవిభవంబుఁ జెందునవ్వనమునందు 30

ఉ॥ చొచ్చి చతుర్దిశాతటుల సొంపొనరించుప్రసూనసంపదల్
మెచ్చుచు నొండొరుం గడచి మించినవేడుకతో ఫలావళుల్
హెచ్చినప్రేమతోఁ గొనుచు నింద్రువనంబున సంచరించున
య్యచ్చరముద్దుగుమ్మలక్రియన్ పువుఁబోఁట మెలంగి రంగనల్ 31

సీ॥ తమపదారుణకాంతితతు లెంతయుఁ గడంగి, తెలుకుకుంకుమవసంతములు చల్ల
తమవిలోలవిలోకనవహాసితద్యుతుల్, దనరి కస్తురివసంతములు చల్ల
తమ మించుమెఱుఁగుటొందపుమేని నిగ్గులు, తతహరిద్రావసంతములు చల్ల
తమమందహాససుందర చంద్రికావళుల్, తఱుచు గప్రపువసంతములు చల్ల
గీ॥ పల్లవాధర లుల్లసత్పాణిపద్మ। కంకణాంగదపంక్తులు ఘల్లుఘల్లు
రనగ నవ్వనమెల్ల మెలన మెలంగి। రంగజునిరాణి బహుభామలై నకరణి 32

సీ॥ ఈదండగాదెయీ వేదండయాన బ, ల్విదండ గొని వ్రేయఁ బూనె నన్ను
నీకొమ్మఁగాదె ము న్నీకొమ్మచిగురాకు, నీకొమ్మ ననుమందా నే గ్రహించె
నీరాలఁగాదెపన్నీ రాలతొతన్వి, యీరాల నటుచక్క నిటుకుఁ దెచ్చె
యీవంకఁగాదె వేనీవంకః ॥ లేవంకముగఁ గూర్చి యేనొసఁగుట
గీ॥ యిచ్చటనెకాదె పచ్చరాగచ్చుదిన్నె। ముచ్చటలుమీఱ మెచ్చుచు రచ్చయుంట
(మఱియు నిచటనె కాదె ప్రేమమెయి మనము)। గచ్చు లనుకొంట యోమత్స్య
కంఠులార॥ 33

సీ॥ అదె చిగురాకు మెచ్చొదవెఁగోకిలవాణి?, కొరలెఁ బన్నీడు చకోరనయన?
యిదె ద్రాక్షగుత్తిఁ జెన్నెసఁగెఁ జిల్కలకొల్కి?, యలరులు లతకూన? యలకె నదిగొ
యిది విరితేనె పెంపెక్కె మధుపవేణి?, యదె మెట్టదామరల్ హంసయాన?
యిదె చల్లనైనపెన్పొద హరిణేక్షణ?, యదె కృతక నగంబు హరివలగ్న?
గీ॥ యిచటఁ జరియింపుఁ డింపుగ నింతులార। యనుచుఁ దత్తన్మనోజ్ఞవిహారయుక్త
చతురసూక్తుల నొండొరుల్ సరసరీతి। నందుఁ బుష్పాపహృతి సేయ నాత్మఁ దెంచి॥ 34